శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# వేదవైభవం-3



జ్వాలానరసింహ స్వామి, అహోబిలం



'పండితరత్న' డా|| ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అ(ఝ)ఏగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



భగవద్రామానుజులు, అహోబిలం



నావల్ పాక్కమ్ యజ్ఞ వరాహాచార్య(కణ్ణన్)స్వామి వారు

# విజ్ఞాపన

వేదాలు అనంతాలు. ఈ విషయాన్ని వేదాలు స్వయంగా "అనంతా వై వేదా" అని అంటూ తెలియజేసింది ఈ విధంగా అనంతంగా ఉండే వేదాల మహిమ కూడా అంతులేనిది. ఎందుకంటే, వేదం సాక్షాత్తు భగవంతుని స్వరూపమే కదా. అది ఆ భగవంతుని వలెనే నిత్యమైనది, ఏదోషం లేనిది,ప్రళయకకాలంలో కూడా నిలచి ఉండేది.

ఇటువంటి అప్రమేయ వైభవాన్ని కలిగిన వేద మహిమను వేద వేదాంగ స్మృతి ఇతిహాస పురాణ కావ్యాది పలు గ్రంథాలలోని పలు సూక్తులు కీర్తిస్తున్నవి. కొన్ని సూక్తులు అయితే వేదాన్ని అనేక విధాలుగా ఉపమిస్తూ దాని వైభవాన్ని తెలియజేస్తున్నాయి.

ఈ విధంగా వ్యక్తం అవుతున్న, వేదానికికల పలు విధాలయిన సామ్యాలను సుప్రసిద్ధ విద్వాంసులు నావల్ పాక్కమ్ యజ్ఞ వరాహాచార్య స్వామి వారు( కణ్ణన్ స్వామి వారు )వివరిస్తూ పలు ప్రసంగాలను అందిస్తున్నారు. వారు వివరించిన కొన్ని వేద సామ్యాలను ఆధారంగా చేసికొని ఈ గ్రంథం సిద్ధం చేయబడింది. ఈ గ్రంథాన్ని ఆస్తికపాఠకులు అందరూ ఆదరంగా గ్రహిస్తారని నమ్ముతున్నాను. ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో నాకు సహకరించిన శ్రీమాన్ చిరంజీవి వంగల కేశవ అయ్యంగార్ స్వామివారికి అనేక మంగళాశాసనాలను అందిస్తున్నాను తమ ఉపన్యాసాలను ఈ విధంగా తెలుగులో అనువదించి గ్రంథరూపంలో వెలువరించడానికి తమ అనుమతిని ఉదాహరణగా ఇచ్చిన శ్రీమాన్ కణ్ణన్ స్వామివారి సన్నిధిలో అనేక కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. స్వస్తి.

భాగవత విధేయుడు

ఈ ఏ శింగరాచార్యులు.

# వేదధేనువు

"వేదం గోవు వంటిది" అనే విషయాన్ని గురించి సంగ్రహంగా గమనిద్దాం. ఈ విషయంలో స్కాంద పురాణం, యాదవాభ్యుదయం, సహస్రనామ నిరుక్తి, గీతా మాహాత్మ్యం, ఆపస్తంబధర్మ సూత్రం మొదలైన గ్రంథాల నుండి కొన్ని ప్రమాణాలను గమనించి, ఈ విషయాన్ని గూర్చి తెలుసుకుందాం.

1) వేదానికి, పాలిచ్చే ధేనువునకు గోవు ఒకే పేరు ప్రసిద్ధమైనది. ఈ విషయం ఏ విధంగా తెలుస్తున్నది? అని అంటే,

భగవంతునకు గోవిందుడు అని పేరు. ఈ నామం శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రంలో రెండు చోట్ల కనిపిస్తుంది. "గోవిందో గోవిదాం పతిః" అనిఒక చోట, "మహావరాహో గోవిందః" అని ఇంకొక చోట ఈ నామం కనిపిస్తుంది. అయితే, మరి, ఒకే నామం రెండుసార్లు వస్తే పునరుక్తి అనే దోషం రాదా? అని అంటే, ఈ రెండు నామాలకు వేరు వేరు అర్థాలు ఉన్నందున, పునరుక్తి దోషం ఏ మాత్రం రాదు– అని భట్టర్ వారు తమ సహస్రనామ స్తోత్ర భాష్యంలో తెలియజేశారు. ఏ విధంగా ఈ రెండు నామాలకు వేరు వేరు వర్గాలు అర్థాలు ఉన్నాయి? అని గమనించి చూసినప్పుడు, గోశబ్దానికి రెండు అర్థాలు ఉన్నాయి. పాలిచ్చే గోవుకు, వేదానికి సంస్కృతంలో "గౌః" అనే ఒకే నామం ఉన్నది. అని సంస్కృత పదం నిఘంటువులు తెలుపుతున్నాయి. గోవింద నామాన్ని వివరించే సహస్రనామ నిరుక్తి "గావో వేదగిరః ప్రోక్తాః" అని తెలుపుతున్నది. దీనిని బట్టి గోవింద నామానికి ఏమి అర్థం? అంటే, వేదవాక్కులను పొందుతున్నాడు– అని అర్థం. భాగవత మహాపురాణంలో వర్ణింపబడిన శ్రీకృష్ణ చరిత్రనుబట్టి ఆ స్వామి గోవర్ధన పర్వతాన్ని ఎత్తిన తరువాత అతనికి గోవింద పట్టాభిషేకం అనే ఒక ఉత్సవం జరిగింది. అప్పుడు ఆ స్వామికి గోవింద నామం సమర్పింపబడింది– అని తెలుస్తున్నది. అప్పుడు గోవింద శబ్దానికి ఏమి అర్థం? అంటే, గోవులను అన్నిటిని పొందినవాడు కనుక, శ్రీకృష్ణునకు గోవిందుడు అనే నామం వచ్చిందని ఆ పురాణ కథను బట్టి తెలుస్తున్నది. దీనిని బట్టి మనకు ఏమి తెలుస్తున్నది? అని అంటే, గోవింద నామం రావడానికి రెండు

కారణాలు ఉన్నాయి. పాలిచ్చే గోవులను పొందినందువల్ల గోవిందుడు అయ్యాడు– అని, వేదవాక్కులను పొందినందువలన గోవిందుడు అయ్యాడు– అని ఏర్పడుతున్నది. ఈ విధంగా వేదానికి, గోవులకు మధ్య సామ్యం సిద్ధించింది. గోవింద నామం భగవంతునకు సిద్ధించడానికి ఈ రెండు అర్థాలు, అంటే, వేదానికి, గోవుకు మధ్య ఉండే సామ్యం కారణమని కూడా ఇక్కడ ఏర్పడుతున్నది.

ఇప్పుడు, ప్రస్తుతానికి సంస్కృతగోపదాన్ని విడిచిపెట్టి, ద్రావిడంలో "మాడు" అనే పదాన్ని గమనిద్దాం. విశేషమేమంటే, మాడు అనే ద్రావిడపదానికి వేదం, గోవు– అనే ఈ రెండూ అర్థాలే. గోవును మాడు అనే పదంతో వ్యవహరించడం ద్రావిడంలో ప్రసిద్ధమే. దేశికులు వేదాన్ని కూడా "మాడు" అనే పదంతో నిర్దేశించారు. పరమపద సోపానం అనే గ్రంథంలోని "అందణర్ మాట్టిలుమ్" అనే ప్రయోగంలో ఇది కనపడుతుంది. "మాడు "అనే పదానికి ఈ రెండు అర్థాలు ఏ విధంగా వచ్చాయి?అని అంటే, "కాల్ నడై చ్చెల్వమ్" (కాలితో సంచరించే ధనం), "కల్వి చ్చెల్వమ్" (విద్యాధనం) అనే ప్రయోగాలలో, సంచరించే ధనాలలో గోవు ప్రధానమైనది, విద్యాధనాలలో వేదం ప్రధానమైనది– అనే సామ్యాన్ని బట్టి ఈ విధంగా ప్రయోగాలు వచ్చాయని చెప్పవచ్చు. ఇంకా గమనించి చూస్తే, వేదాలే పశువుల రూపంలో వచ్చాయని పురాణాలలో కూడా చెప్పబడింది.

భగవంతుడు శ్రీకృష్ణుని రూపాన్ని పొందినప్పుడు గోవులను మేపాడు కదా. వేదాలే ఆ గోవుల రూపంలో అవతరించాయి. ఆ అవతారానికి ముందు, వేదాలు ఈఏమూడు కార్యాలను చేస్తూ వచ్చాయో, ఆ మూడు కార్యాలనే శ్రీకృష్ణావతారంలో అవి గోవుల రూపంలో పొందినప్పుడు కూడా చేశాయి ఆ మూడు కార్యాలు ఏవి? అంటే, దానిని దేశికులు యాదవభ్యుదయంలో మనకు ఈ సూక్తి ద్వారా తెలియజేస్తున్నారు.

"గోపాయమానే పురుషే పరస్మిన్ గోరూపతాం వేదగిరో భజంత్యః, భవ్యైరసేవంత పదం తదీయం స్తోభప్రతిచ్ఛందనిభైః స్వశబ్దైః".

గోవులు, వేదాలు సమానంగా చేసే మూడు కార్యాలు ఏవి? అంటే,

1)మంగళ శబ్దాలను పలకడం. –అనేది ఒకటి. వేద ధ్వని మంగళకరమైనది. "మంగళమ్ శేర్ మఱై" అని ఈ విషయాన్ని తిరుమంగై ఆళ్వార్లు తెలియజేస్తారు. ఆ విధంగానే, గోవులు కూడా అంబాశబ్దంతో మంగళనాదాన్ని చేస్తాయి. ఈ సంగతి "భవ్యైః స్వశబ్దైః" అనే ప్రకృతప్రయోగంలో తెలుపబడింది.

2) వేదాలు భగవంతుని మాత్రమే ప్రతిపాదిస్తూ, ఆ స్వామి శ్రీ చరణాల దగ్గరే ఉండేటట్లు, పాలిచ్చే గోవులు కూడా శ్రీకృష్ణుని చుట్టూ తిరుగుతూ ఉన్నాయి, ఆ స్వామి పాదాల దగ్గరే ఉన్నాయి. ఈ విషయం పై శ్లోకంలో "అసేవంత పదం తదీయమ్" అనే ప్రయోగంలో తెలుపబడింది.

3) మూడవ కార్యం ఏమంటే– భగవంతునిచే రక్షింపబడే స్థితిని కలిగి ఉండడం. వేదాలు ఇంతకుముందు భగవంతునిచే పలు అవతారాలలో రక్షింపబడ్డాయి. ఆ విధంగానే కృష్ణావతారంలో కూడా గోవులు శ్రీకృష్ణునిచే రక్షింపబడ్డాయి. ఈ విధంగా ఈ రెండు అర్థాలలోనూ భగవంతుడు గోపాలుడు అయ్యాడు.

ఈ శ్లోకం ద్వారా మనకు వదిలించే వేదమహిమలోని విశేషాలు–

1) భగవంతుడు అవతరించేటప్పుడు ఆ స్వామితో పాటు వేదాలు కూడా అవతరిస్తాయి.
2) భగవంతుని చరణాలను ఎల్లప్పుడూ వేదాలు ఆశ్రయించి సేవిస్తాయి.
3) భగవంతుని సమీపంలోనే ఉంటూ మంగళ ధ్వనిని చేస్తాయి.
4) భగవంతునిచే రక్షింపబడతాయి.

ఈ విధంగా వేదాలు గోవుల రూపాన్ని పొంది, శ్రీకృష్ణుని సమీపంలో సంచరిస్తున్నాయి– అనే విషయాన్ని యాదవాభ్యుదయంలో దేసికులు పలుసార్లు ప్రస్తావిస్తారు. "అరణ్యకైః ఆశ్రిత ధేనుభావైః "అని ఒకచోట వేదంలోని అరణ్యకాలు అనే భాగాలు ఇప్పుడు కృష్ణావతార సమయంలో ధేనువుల రూపాన్ని పొందాయని అన్నారు. ఇంకొక సందర్భంలో, "శుభతర్ణక శోభితాంతికాః, సవిధే తస్య చ ధేనువిగ్రహాః" అనే శ్లోకంలో "అనఘాంగవతీః" అనే ఒక ప్రయోగం ఉన్నది. ఏ విధంగా వేదానికి ఏ దోషం

లేని అంగాలు, అంటే, శిక్షా మొదలైన అంగాలు 6 ఉన్నాయో, ఆ విధంగానే, ఈ గోవులకు కూడా అందమైన అంగాలు ఉన్నాయి– అని ఇంకొక సామ్యాన్ని దేశికులు సూచించారు.

ధేనువునకు, వేదానికి మధ్య ఉండే సామ్యం స్కాంద పురాణంలో చక్కగా వర్ణింపబడినది, "సర్వస్యాధారభూతా యా వత్సధేనుః త్రయీమయీ, అస్యాం ప్రతిష్ఠితో విశ్వం విశ్వహేతు శ్చ యా మతా, ఋక్ పృష్ఠాసా యజుర్మధ్యా సామకుక్షిపయోధరా" "అనే సూక్తిలో. ఈ విధంగా వేదాన్ని ధేనువుతో సమంగా రూపించేటప్పుడు, వేదమనే ధేనువు అందరికీ ఆధారమై ఉన్నది. ఈ ధేనువులోనే ప్రపంచమంతా నిలచి ఉన్నది, దీనికి ఋక్కులు పృష్ఠంగా, యజుస్సులు మధ్యభాగంగా, సామాలు కుక్షిగా, పయోధరాలుగా అవుతున్నాయి. ఇష్టాపూర్తాలు అనేవి కొమ్ములు అవుతున్నాయి. దానిహంకారమే వేదమయంగా ఉన్నది –అని ఈ విధంగా వర్ణిస్తూ గోవుకు వేదానికి మధ్య ఉండే సామ్యాన్ని స్కాంద పురాణం చాలా అందంగా రూపించింది.

వేదం, గోవు –అనే ఈ రెండు పవిత్రమైనవి. గోమాతాష్టోత్తర స్తుతిలో "పాదరేణు పావిత భూతలా" అనే ఒక నామం ఉన్నది. గోవు తన పాదరే రేణువులతో భూమిని పవిత్రం చేస్తున్నది –అని దీని అర్థం. వేదం కూడా తన పదాలతో మనలను పవిత్రం చేస్తున్నది. పదమంటే పాదమే కనుక, దీనివల్ల ఈ రెండిటికి మధ్య ఉండే ఇంకొక పోలికకూడా ధ్వనిస్తున్నది.

వేదం పవిత్రంగాను, పావనంగాను ఉన్నది. ఇది ఏ విధంగా తెలుస్తున్నది? అంటే, "అపహత పాప్మా స్వాధ్యాయో దేవపవిత్రమ్" అని వేదమే స్వయంగా తాను పవిత్రమని, పావనమని తెలిపింది. దీనివల్ల వేదం, గోవు రెండు పవిత్రమైనవి, పావనమైనవి –అని తెలుస్తున్నది.

ధేనువు వల్ల, వేదం వల్ల కలిగే ప్రయోజనాలు అందరికీ లభిస్తాయి. గోవు వలె ఉండే వేదం వేదపండితులకు ధేనువు వలె అవుతున్నది. వేద పండితులు కాని సామాన్యులకు అందరికీ ధేనువు ఉపయోగపడుతున్నది. దీని ఫలమైన పాలను జనులంతా అనుభవిస్తారు. వేదపండితుని పూజించి, పోషించి, అతని వేద గోవువల్ల కలిగే ప్రయోజనాలను మిగిలిన జనులు అందరూ పొందుతున్నారు.

పాలను తీసిన తర్వాత గోవు పొదుగు ఎండిపోయేటట్లే, వేదపండితుడు కూడా ప్రతి గ్రహంచేత, పూజాదులను స్వీకరించడంచేత రిక్తుడైపోతాడు. అప్పుడు ఏం చేయాలి? అంటే, పాలను ఇచ్చి పొదుగు ఎండిపోయిన గోవును మళ్లీ మేపి, తరువాత పాలు తీసే సమయంలో దాని దగ్గర నుండి పాలను తీయాలి. ఆ విధంగానే రిక్తుడైన వేద పండితుడు కూడా వేదజపాలతో, వేద హోమాలతో మళ్లీ తిరిగి తనలో తేజస్సును శక్తిని సంపాదించుకోవాలి. దీనికి ఆప్యాయనం అని పేరని ఆపస్తంబ ధర్మసూత్రం తెలుపుతున్నది అప్పుడే ఆ వేద పండితుడు మళ్లీ పూర్వం వలె ఇతరులకు ఉపయోగపడతాడు.

"వట్టిపోయిన గోవును చూసి, జనులారా! మీరు దాని దగ్గర పాలను తీయాలని ప్రయత్నించి మోసపోకండి. చక్కని యోగ్యతను కలిగిన వేదపండితులకు మాత్రమే దానాన్ని ఇచ్చి, మీరు కోరిన ప్రయోజనాన్ని పొందండి "అని ఆపస్తంబుడు మనకు ఒక ఉపదేశాన్ని చేస్తున్నారు.

"అర్చితః పూజితో విప్రో దుగ్ధా గౌరివ సీదతి,<br>
ఆప్యాయతే యథా ధేనుః తృణై రమృతసంభవైః,<br>
ఏవం జపైశ్చ హోమైశ్చ పునరాప్యాయతే ద్విజః"<br>
అనేవి ఆ సూక్తులు.

అందువల్ల దానాలను, పూజాదులను స్వీకరించే వేద పండితుడు మాటిమాటికి తిరిగి జపాలను, హోమాలను చేసి, తన శక్తి సామర్థ్యాలను సంపాదించుకోవాలి అని తెలిపినట్లయినది.

## వేదశైలం

"వేదాలు పర్వతాల వంటివి" అనే ఉపమానాన్ని పురస్కరించుకుని వేద వైభవాన్ని తెలిసికొందాం. ఇందుకోసం కాఠకం, మార్కండేయ పురాణం, అధికార సంగ్రహం, నిక్షేపరక్ష మొదలైన గ్రంథాల నుండి కొన్ని ప్రమాణాలను పురస్కరించుకొని, ఈ ఉపమానంలోని అందాన్ని, చమత్కారాన్ని గమనిద్దాం.

వేదాన్ని ఒక పర్వతంగా కాఠకం వర్ణిస్తున్నది. "వేదశైలం" అని మార్కండేయ పురాణం అంటున్నది. "ఆగమ సానుమాన్" అని యాదవాభ్యుదయలో చెప్పబడింది. "వేద వెఱ్ఱు "అనేది అధికార సంగ్రహ సూక్తి. "నిగమ గిరి" అని నిక్షేపరక్షలోని సూక్తి. ఈ విధంగా ఒకే విధమైన ఉపమానానికి పలు సూక్తులు గోచరిస్తున్నాయి.

వేదం ఏ ఏ రీతులలో పర్వతంలో పోలి ఉన్నది? అనే ప్రశ్నకు ఆయా చోట్ల సమాధానాలు కూడా గోచరిస్తున్నాయి. వాటిలో మొదటి కారణం ఏమంటే, అది అడవిలో పెద్దదిగా ఉన్నది, ఉన్నతంగా ఉన్నది –అని. ఈ విషయం భరద్వాజమహర్షి కథ ద్వారా వేదమే మనకు తెలుపుతున్నది.

"భరద్వాజో హ వై త్రిభిరాయు ర్బ్రహ్మచర్య మువాస" అని ఈ కథ కాఠకంలో ఆరంభం అవుతున్నది. భరద్వాజ మహర్షికి వేదాలను అభ్యసించడంలో అమితమైన ఆసక్తి ఉండేది. మూడు వందల సంవత్సరాల ఆయుష్కాలాన్ని పొందిన ఆ మహర్షి తన ఆయుష్కాలమంతా వేదాధ్యయనంలోనే గడిపాడు. అతని ఆయుస్సు పూర్తి అయే సమయానికి అతని శరీరం శిథిలమై, శక్తి తగ్గిపోయింది. అధ్యయనం చేసే సామర్థ్యం అతనికి లేకుండా పోయింది. అప్పుడు ఆ మహర్షి దగ్గరకు ఇంద్రుడు వచ్చి, "భరద్వాజమహర్షీ! మీకు ఇంకొక వంద సంవత్సరాలు కాలం ఇచ్చినట్లయితే మీరు ఏమి చేస్తారు ? "అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా ఆ మహర్షి "బ్రహ్మచర్య మేవైతేన చరేయమితి హోవాచ" అని అంటూ" నాలుగవ ఆయుష్కాలంలో కూడా నేను వేదాధ్యయనాన్నే చేస్తాను" అని అన్నాడు. అప్పుడు ఇంద్రుడు ఎదురుగా మూడు

పర్వతాలను సృష్టించి వాటిని ఆ మహర్షికి చూపించి, ఆ మూడు పర్వతాలలో ఒక్కొక్క పర్వతం నుండి ఒక్కొక్క పిడికిలి ఇసుకను తీసుకొని, ఆ ఇసుకను చూపిస్తూ, ఈ విధంగా అన్నాడు. "భరద్వాజ మహర్షీ! మీకు ఎదురుగా కనిపించే మూడు పర్వతాలే మూడు వేదాలు. నేను చేతిలో గ్రహించిన ఇసుక ఉన్నది కదా! అంత పరిమితిలోనే మీరు ఒక్కొక్క వేదం నుండి అధ్యయనం చేయగలిగారు. ఇక, మీరు అధ్యయనం చేయవలసిన పరిమితిలోని వేదభాగం, ఇదిగో!, ఈ పర్వతాల పరిమితిలో ఉన్నది. ఇంతటి పెద్ద పెద్దవి అయిన వేదాలను ఏ ఒక్కరు తమ ఆయుష్కాలంలో పూర్తిగా అధ్యయనం చేయడం అనేది సాధ్యం కాని పని. "అనంతా వై వేదాః" – వేదాలు అనంతాలు. ఎల్ల లేనిది అందుచేత ఈ వ్యర్థ ప్రయత్నాన్ని మీరు విరమించండి. వేదాలకు సారాలైన కొన్ని మంత్రాలను ఉపదేశిస్తాను, గ్రహించండి" అని అన్నాడు. ఇంద్రుని మాటకు భరద్వాజమహర్షి అంగీకరించి, ఆ విధంగానే అతని దగ్గర నుండి వేదసారరూపాలైన మంత్రాలను గ్రహించాడు –అని ఈ కథలోని విషయం.

ఈ కథ నుండి మనం గమనించవలసిన విషయం ఏమంటే– "కట్రదు కైమణ్ణళవు, కట్రాదదు మలై అళవు" చేర్చిన విద్య చేతిలో ఇమిడి మట్టి పరిమితిలోనిది ఇక నేర్వవలసిన విద్య పర్వతంతో సమానం) అనే సామెతకు ఈ వేదవిద్యకూడా లక్ష్యం అవుతున్నది. ఎంత గొప్ప అభ్యసించినవాడైనా, అతడు నేర్చిన విద్య చాలా అల్ప భాగమని భాగం అని, నేర్వవలసిన మిగిలిన భాగం చాలా అధికమని దీనివల్ల స్పష్టమవుతున్నది. వేదాలు ఎందువల్ల పర్వతాలలె గొప్పవి?ఉన్నతమైనవి? అధికమైనవి? అని మొదలైన ప్రశ్నలకు ఈ కథ సమాధానాలను తెలుపుతున్నది.

వేదాలు పర్వతాల వంటివి– అనే విషయాన్ని వేదమే తెలియజేసింది కదా. మరి, ఈ కథను చూసి, తరువాత కాలంలో మహర్షులు, కవులు ఇంత గొప్ప ఉన్నతమైన, అనంతమైన వేదాన్ని విడిచి పెట్టారా? వదిలిపెట్టలేదు. తరువాత కూడా రకరకాలుగా భావనలను చేసి వర్ణించి, దీని వైభవాన్ని తెలియజేశారు.

మార్కండేయ పురాణంలోని ఒక శ్లోకం వేదాలు పర్వతాల వంటివి– అని మనకు తెలుపుతున్నది. వేదాలు పర్వతాల వంటివి అయితే, ఆ పర్వతాల నుండి ఏ ఏ ప్రవాహాలు ప్రవహిస్తున్నాయి? అనే ప్రశ్నకు సమాధానంగా ఈ శ్లోకం అవతరించింది. వ్యాసుల సూక్తులే ఆ వేదాలు అనే పర్వతాల నుండి ప్రవహించే ప్రవాహాలు. "వ్యాసవాక్య జలౌఘేన కుధర్మతరుహారిణా, వేదశిలావతీర్ణేన, నీరజస్కా మహీ కృతా" అనేది ఆ శ్లోకం. హిమాలయ పర్వతం నుండి గంగానది ప్రవహిస్తున్నదని. వింధ్య పర్వతం నుండి నర్మదానది ప్రవహిస్తున్నదని, సహ్యాపర్వతం నుండి కావేరీ నది ప్రవహిస్తున్నదని ప్రసిద్ధం. ఆ విధంగానే, వేద పర్వతం నుండి ఏ నది ప్రవహిస్తున్నది? అని అంటే, వ్యాసులు వేదాలను ఆధారంగా చేసుకుని అనుగ్రహించిన పురాణాలే ఆ నదులు. వేద పర్వతాలనుండి ఈ పురాణాలు అనే నదులు భూమిపై ప్రవహించేటప్పుడు భూమిలో ఉండే రజస్సు లేకుండా పోతున్నదట. ఇక్కడ నదుల విషయంలో రజస్సు అంటే– దుమ్ము, ధూళి. నీటి ప్రవాహం ప్రవహించినప్పుడు భూమిపై ఉండే దుమ్ము, ధూళి అంతా కొట్టుకుపోతుంది అనే విషయం మనకు తెలిసినదే. ఇక, వేద నదుల పక్షంలో, రజస్సు అంటే రజోగుణం –అని అర్థం. ఈ లోకంలో ఉండే గుణాలలో రజస్సు అనేది ఒకటి. పురాణాలను పఠించడం వల్ల ఈ రజోగుణం తొలగిపోతుంది –అని ఈ శ్లోకంలోని అర్థం. ఈ విధంగా ఈ శ్లోకం శేష భంగిమలో అనుగ్రహింపబడింది. పురాణ నదులు భూమిపై ప్రవహించినప్పుడు, భూమిపై ఉండే రజోగుణం తొలగిపోతుంది –అని ఇక్కడ చమత్కారంగా ధ్వనించే అర్థం.

పర్వతాల నుండి భూమిపై నదులు ప్రవహించేటప్పుడు, నీటి ప్రవాహం అధికం అవుతుంది. ప్రవహించే దారిలో అడ్డుగా ఉండే చెట్లు, రాళ్లు మొదలైనవానిని అన్నిటిని ఆ నీటి ప్రవాహాలు కొట్టుకొని పోతూ ప్రవహిస్తాయి. నీటి ప్రవాహానికి ఉండే బలం అది. దీనిని మనం లోకంలో ప్రత్యక్షంగా చూస్తున్నాము. వేద పర్వతాల నుండి పురాణ నదీ ప్రవాహాలు ప్రవహించేటప్పుడు ఏ వృక్షాలను అవి కొట్టుకొని ప్రవహిస్తున్నాయి? అని అంటే, "కుధర్మతరుహారిణా, "– అని అంటూ ఈ శ్లోకం సమాధానం పలుకుతున్నది. అంటే, అనీతి, అధర్మాలే ఆ వృక్షాలు. అవి ఈ పురాణనదుల చేత పెళ్ళగింపబడి

పోతాయి. వాటిని లేకుండా చేస్తూ ఈ పురాణ నదులు ప్రవహిస్తాయి– అని ఈ సూక్తి మనకు తెలుపుతున్నది.

ఇప్పుడు, ఇక్కడ భాసించే ఒక రూపక పరంపరను గమనిద్దాం. వేదం అనే పర్వతం, పురాణం అనే నది, రజోగుణం అనే ధూళి, దుమ్ము, అనీతి, అధర్మం అనే అడ్డుగా ఉండే వృక్షాలు –అనే ఒక అందమైన రూపక పరంపర ఇక్కడ భాసిస్తున్నది.

ఇంతవరకు వేదాలు పర్వతా వలె ఉన్నతమైనవి, గొప్పవి, అనేకమైనవి– అని, పర్వతాలు నదులకు జన్మస్థానాలు అయినట్లు, వేదం అనే పర్వతం పురాణాలు అనే నదులకు జన్మస్థానమైనది– అనే రెండు విశేషాలను గమనించాం.

ఇక, మూడవ విశేషం ఏమంటే, వేదం పర్వతం వలె చాలా గమనికతో సంచరించవలసిన చోటు అనేది. పర్వతాలను ఎక్కేటప్పుడు శ్రమ కలుగుతుంది. ముళ్ళు, రాళ్లు కాళ్లకు గుచ్చుకుంటాయి. క్రూర మృగాలు అంతటా గోచరించి భయపెడతాయి. మనం చాలా జాగ్రత్తగా గమనికతో పర్వతాలను ఎక్కాలి, వాటిలో సంచరించాలి. ఆ విధంగానే, వేదం విషయంలో కూడా, వేదాలను అధ్యయనం చేసేటప్పుడు మనం చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. ఈ విషయాన్ని "సమాహితధియా సేవ్యమ్" అనే ఒక యాదవ అభ్యుదయ సూక్తి తెలుపుతున్నది. ఏ విధంగా పర్వతాలలో మనం చాలా జాగరూకతతో సంచరించాలో, ఆ విధంగానే వేదాలు అనే పర్వతాలలో కూడా చాలా జాగరూకతతో సంచరించాలి– అని ఈ సూక్తి మనకు తెలియజేస్తున్నది. జాగ్రత్తగా– అనే అర్థాన్ని చెప్పడానికి సంస్కృతంలో "అప్రమాదతః" అనే ఒక పదం ఉన్నది. ఈ పదాన్ని ప్రయోగిస్తూ వ్యాసమహర్షి మనకు మహాభారతంలో ఈ విషయాన్ని తెలియజేస్తున్నారు, "అప్రమాదశ్చ వః కార్యః బ్రహ్మ హి ప్రచురచ్ఛలమ్" అని అంటూ. వేద విద్యాభ్యాసాన్ని చేసే బ్రహ్మచారులను ఉద్దేశించి వేద వ్యాసమహర్షి ఈ విధంగా తెలియజేస్తున్నారు. "మీరు వేదాన్ని అధ్యయనం చేసే విషయంలో ఎంత మాత్రం అజాగ్రత్తగా ఉండకూడదు ఎందుకంటే, వేదంలో ప్రమాదపడే సందర్భాలు చాలా ఉన్నాయి. ఏ విధంగా అంటే, వేద సూక్తులను అనుసంధానం

చేసేటప్పుడు, కొన్ని కొన్ని సందర్భాలలో దీనికి తర్వాత దీనిని చెప్పాలలా?దానిని చెప్పాలా ? అనే సందేహం కలిగే సందర్భాలు అనేకం ఉన్నాయి. అజాగ్రత్తగా ఉన్నట్లయితే వేరొక సందర్భంలోకి మనం పోయే ప్రమాదం ఉన్నది. ఈ విధంగా వేదం మనకు ప్రమాదాన్ని కలిగించవచ్చు, భ్రమను కలిగించవచ్చు" అనే సందేశాన్ని వ్యాసులు ఇక్కడ "ప్రచుర చ్ఛలమ్" అనే ప్రయోగం ద్వారా సూచిస్తున్నారు. "మీరు చాలా జాగ్రత్తగా ఉండండి" అని తన శిష్యులకు వేద వ్యాసమహర్షి సూచిస్తున్నారు. ఈ విధంగా, ఇంతవరకు వేదాలకు పర్వతాలకు మధ్య ఉండే మూడు విధాలైన సామ్యాలను గమనించాము. అవి, వేదాలు పర్వతాలవలె గొప్పవి, వేదాలు పర్వతార వలె నదులకు ఎన్నో స్థానమైనవి, వేదాలు పర్వతాల వలె చాలా జాగ్రత్తగా వ్యవహరించవలసినవి —అనేవి.

ఇక, నాలుగవ సామ్యం ఏమంటే, అధికార సంగ్రహం అనే గ్రంథంలో వేదాంతదేశికులు "వేంగడ వెఱ్పన విళంగుమ్ వేదవఱ్పే" అనే ఒక సూక్తిని అనుగ్రహించారు. వేంకటాచల పర్వతం అనేది వేదమే. వేదమే ఈ పర్వతంగా రూపొందింది— అని వారు ఇక్కడ అంటున్నారు. వేదంగా ఉండే సమయంలోనూ ఇది భగవంతుని ధరిస్తూ ఉన్నది, పర్వత రూపంలో ఉండేటప్పుడు కూడా వేంకటేశ్వరభగవంతుని దరిస్తూ ఉన్నది—అని ఇక్కడ భావం.

ఇంతవరకు మనం వేదం పర్వతంవంటివి అని వివరించడం ప్రారంభించి, వేదం పర్వత రూపాన్ని పొందినది— అని తెలుసుకున్నాం. ఇక, చివరగా, నిక్షేపరక్ష అనే గ్రంథంలో ఉండే ఒక అద్భుతమైన వేదాలకు, పర్వతాలకు మధ్య ఉండే సామ్యాన్ని గమనిద్దాం. నిక్షేపరక్ష అనే ఈ గ్రంథం శరణాగతి శాస్త్రం అనేది నిధివలె రక్షించదగినది— అనే విషయాన్ని తెలుపడం కోసం అవతరించింది. ఇతరులు శరణాగతిని గురించి చేసే ఆక్షేపాలను అన్నిటిని పరిహరించి, ఆ ధర్మాన్ని సుస్థాపించడం కోసం దీనిని దేశికులు అనుగ్రహించారు. ఆ గ్రంథంలో "నిగమగిరి నిగూడం న్యాసవిద్యానిధానమ్" అనే ఒక సూక్తి ఉన్నది. వేదమనే గిరి ఉన్నది కదా! ఆ పర్వతంలో రహస్యంగా గుప్తంగా ఉండే

నిధియే శరణాగతి విద్య. – అని దీని భావం. పూర్వకాలంలో కొందరు ధనికులు తమ వద్ద ఉండే ధనాన్ని, అమూల్యమైన వస్తువులను తమ ఇంటిలో దాచుకునే సౌకర్యం లేనప్పుడు, వాటిని దగ్గరలో ఉండే పర్వతాలపై రహస్యంగా తమకు మాత్రమే తెలిసిన ఒకచోట దాచి ఉంచి, ఆవశ్యకమైనప్పుడు అక్కడకు వెళ్లి, వాటిని ఇతరులకు తెలియకుండా తెచ్చుకొని ఉపయోగించుకొని ఆనందించేవారు. ఈ విధంగా చూసినప్పుడు, వేదం అనే పర్వతంలో ఏ నిధి ఉన్నది? అని అంటే, వేదం అనే పర్వతంలో రహస్యంగా యోగ్యులకు మాత్రమే ఉపయోగపడే విధంగా దాచిపెట్టబడిన నిధియే శరణాగతి. దీనివల్ల మనకు ఏమి తెలుస్తున్నదంటే, విధి వలె మనలను రక్షించగలిగినది శరణాగతి –అనే విషయాన్ని తెలియజేయడంతో పాటు, వేదాన్ని ఒక పర్వతంతో పోల్చడం ద్వారా వేద మహిమను కూడా దేశికులు ఇక్కడ మనకు తెలియజేస్తున్నారు. ఇంకా ఇటువంటి సామ్యాలు వేదాలకు, పర్వతాలకు మధ్య ఉన్నప్పటికీ, ఇంతటితో ఈ వ్యాసం విరమింపబడుతున్నది.



లక్ష్మీ నరసింహస్వామి, అంతర్వేది

## వేద సాగరం

"వేదం సముద్రం వంటిది" అనే పోలికను అనుసరించి వేదవైభవాన్ని ఈ వ్యాసంలో గమనిద్దాం. ఈ పోలికను పలు గ్రంథాలు పలు చోట్ల ప్రస్తావించాయి. "శ్రుతి సింధుః" అని గరుడ దండకంలో, "వేదోదన్వాన్ "అని హంససందేశంలో, "నిగమ జలధిః" అని యతిరాజసప్తతిలో, "ఆకృతక వచనాబ్ధిః "అని ఆచార్యచంపూ గ్రంథంలో, "నిగమ మహార్ణవమ్" అని ఆచార్యవింశతిలో, "వేదోదధిః" అని భగవద్గీతకు గల వైశాఖ భాష్యంలో, "వేదశాస్త్రాంబుధిః" అని పాద్మ పురాణంలో అని ఈ విధంగా వేదానికి, సముద్రానికి మధ్య ఉండే సామ్యాన్ని తెలియజేసే పలు సూక్తులు పలు గ్రంథాలలో గోచరిస్తాయి.

ఇన్ని గ్రంథాలు ఇన్ని విధాలుగా ఈ సామ్యాన్ని తెలియజేయడంలో ఏమేమి కారణాలు ఉన్నాయి, ?ఏమేమి సామ్యాలు ఉన్నాయి? ఏ ఏ అంశాలను పురస్కరించుకొని ఈ గ్రంథాలు ఈ సామ్యాన్ని తెలియజేస్తున్నాయి? –అనే విషయాన్ని పలు పలు సందర్భాలలో ఆయా గ్రంథాలే సూచిస్తున్నాయి కూడా. ఆ అంశాలలో మూడు ప్రధానంగా ప్రస్తావించదగినవి ఉన్నాయి. అవి ఏవి అంటే, సముద్రం చాలా పెద్దది. తీరం ఎక్కడుందో తెలియనంత చాలా విశాలమైనది. ఆ విధంగానే, వేదం కూడా, అనంతమైనది, అంతులేనిది– అనేది మొదటి సామ్యం. రెండవ సామ్యం ఏమంటే, సముద్రం చాలా లోతైనది. దాని లోపలకు వెళ్లి కొద్దీ ఎన్నో అమూల్యమైన వస్తువులు గోచరిస్తాయి. ఆ విధంగానే, వేదం కూడా చాలా లోతైనది, చాలా గంభీరాలైన అర్థాలను కలిగి ఉంటుంది, లోపలకు బాగా తరచి చూచినప్పుడు అందులో ఎన్నో గొప్ప గొప్ప విషయాలు గోచరిస్తాయి. ఆ విధంగానే మూడవ సామ్యం ఏమంటే, సముద్రంలో ఎన్నో విధాలయిన రత్నాలు అంటే, ముత్యాలు, పగడాలు మొదలైన చాలా విలువైన రత్నాలు లభిస్తాయి. వేదంలో కూడా "వేదార్థ రత్ననిధిః" అనే విధంగా ఎన్నో అమూల్యమైన వేదార్థాలన్నీ అమూల్యమైన గొప్పగా ప్రకాశించే రత్నాల వంటివి.

ఈ విధంగా మూడు అంశాలలో వేదాలు సముద్రంతో సామ్యాన్ని కలిగి ఉన్నాయి. ఇవేకాక ఇంకా చాలా పోలికలు ఉన్నాయి.

ఈ మూడు సామ్యాలను చాలా గ్రంథాలు తెలియజేస్తున్నాయి వాటిలో ఒకటి వేదాంతదేశికులు అనుగ్రహించిన అధికరణ సారావళి అనే గ్రంథం. ఇందులో "గంభీరే బ్రహ్మవాదే గణయితు మఖిలం కః ప్రవీణః ప్రమేయమ్" అని ఆరంభించి, "మధ్యే హారం నిధేయం మహతి దహతి కిం మౌక్తికం లబ్ధమబ్ధౌ" అని ఒక శ్లోకం ముగుస్తున్నది. అందులో వేదానికి సమానంగా సముద్రాన్ని తెలియజేసి మూడు విధాలైన అంశాలను ఆ రెండింటికి మధ్య దేశికులు తెలియజేస్తున్నారు. ఆ సామ్యాలు మూడు పైన ప్రస్తావించిన సామ్యాలే. వేదం సముద్రం వలె చాలా విశాలమైనది అనే మొదటి సామ్యం "మహతి జల నిధౌ" అనే ప్రయోగం ద్వారా ఇక్కడ ధ్వనిస్తున్నది. లోతుగా ఉండడం అనే రెండవ పోలిక "గంభీరే బ్రహ్మ వాదే" అనే పదం ద్వారా సూచింపబడింది. పలు విధాలైన రత్నాలను కలిగి ఉండడం అనే మూడవ విదమైన సామ్యం ఆ శ్లోకంలో "స్ఫీత నిస్సీమరత్నే" అనే ఆ శ్లోకంలోని ప్రయోగం ద్వారా తెలుపబడింది. అటువంటి విశాలమైన, లోతైన, రత్నాలు నిండిన వేద సముద్రం నుండి బయటకు తీసి కొని వచ్చిన ముత్యమే ఈ అధికరణ సారావళి –అనే గ్రంథం అని పలుకుతూ, సముద్రంలో ఉండే రత్నాలను అన్నిటిని బయటకు తీసుకొని రాలేక పోయినా, లభించిన రత్నాలలోనే మనం కోరిన హితాన్ని పొందవచ్చు కదా– అని అంటూ ఈ శ్లోకాన్ని దేశికులు పూర్తి చేశారు.

ఈ విధంగానే, వేదానికి సముద్రానికి మధ్య ఉండే మూడు విధాలపై మూడు విధాలైన సామ్యాలను ప్రస్తావించి వర్ణించిన కృతులు ఇంకా ఉన్నాయి. వాటిలో శ్రీరామానుజ చంపువు అనే గ్రంథం ఒకటి. అందులో "అగాధే వ్యాకీర్ణే నిగమమయరత్నాకరజలే" పని ఆరంభమవుతున్న ఒకానొక శ్లోకం ఉన్నది. అందులో సముద్రం వ్యాకీర్ణంగా ఉన్నదని చెప్పబడింది. అంటే, చాలా దూరం వ్యాపించి అంతు తెలియకుండా ఉన్నది –అని అర్థం. ఆ విధంగానే, అగాధం, అంటే –చాలా లోతైనది

అని అర్థం. “రత్నాకరజలే” అని అంటే –రత్నాలతో నిండిన నీటిని కలిగినది– అని అర్థం. ఈ విధంగా ఈ సూక్తి లో సముద్రం విశాలంగా, అగాధంగా, రత్నాలతో నిండినదిగా ఉన్నట్లే, వేదం అనే సముద్రం కూడా అగాధంగా, విశాలంగా, రత్నాల వంటి అర్థాలతో నిండినదిగా ఉన్నదని చెప్పబడినట్లయినది.

విశాలంగా ఉన్నందున, గంభీరంగా ఉన్నందున, రత్నాలను ఇస్తున్నందున వేదం సముద్రం వలే ఉన్నది –అని ఇంతవరకు మూడు విధాలయిన సామ్యాలను వేదానికి, సముద్రానికి మధ్య గమనించాము. ఇప్పుడు నాలుగవ సామ్యాన్ని గమనిద్దాం. అది ఏమంటే, భగవంతునకు నివాసస్థానంగా ఉండడం. సముద్రంలో భగవంతుడు ఆదిశేషునిపై పరుండి ఉంటాడు. ఆ విధంగానే, వేదంలో కూడా, భగవంతుడు నివసించి ఉంటాడు– అనే విషయాన్ని మనం ఇప్పుడు చూద్దాం.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రంలో “మహోదధిశయోంఽతకః” అనే ఒక తిరునామం ఉన్నది. ఇక్కడ “మహోదధిశయః” అనే తిరునామానికి సముద్రంలో శయనించి ఉన్నవాడు– అని అర్థం. “మహార్ణవే శయానేఽప్సు మాం త్వం పూర్వమజీజనః” అని వాల్మీకి రామాయణం ఉత్తరకాండలో బ్రహ్మ పలుకుతున్నాడు. భగవంతుడు చాలా పెద్దది అయిన సముద్రంలో శయనించి ఉన్నవాడై, సృష్టిని చేశాడు– అని దీని అర్థం. మనుస్మృతి కూడా ఈ విధంగానే తెలుపుతున్నది. “అపో నారా ఇతి ప్రోక్తాః అపో వై నరసూనవః, తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః” అని అంటున్నది. ఇది నారాయణ పద నిర్వచనం. ఇక్కడ నారాలు భగవంతుని నివాస స్థానం అని చెప్పబడినది. నారాలు అంటే– జలం, అంటే, సముద్రం దానిని వాసస్థానంగా కలిగినవాడు కనుక, భగవంతుడు నారాయణుడు అయ్యాడు– అని ఈ నిర్వచనంలోని అర్థం. ఈ విధంగా విష్ణుసహస్రనామ స్తోత్రం, వాల్మీకి రామాయణం మనుస్మృతి మొదలైన ఉన్నత గ్రంథాలు అన్నీ సముద్రం భగవంతునకు వాసస్థానం అని తెలుపుతున్నవి.

ఆ విధంగానే, వేదం కూడా, భగవంతుని వాసస్థానమే. వేదంలో భగవానుడు వేంచేసి ఉన్నాడు –అని పురాణాలు తెలుపుతున్నాయి. ఉదాహరణకు, పాద్మ పురాణం “మధ్యే సింహాసనం పుణ్యం సర్వవేదమయం శుభమ్, “అని అంటున్నది. , వేదమయమైన సింహాసనంలో భగవంతుడు దివ్యమంగళ రూపంతో వేంచేసి ఉన్నాడు– అని తెలుపుతున్నది. దివ్య సూరులు అనబడే ఆళ్వార్లు కూడా ఈ విషయాన్ని పదేపదే తెలియజేస్తారు. “వేంగడ త్తాయ్ నాల్ వేద పణ్ణగత్తాయ్ నీ కిడంద పాల్” అనేది పొయ్ గై ఆళ్వారుల సూక్తి. ఇక్కడ, “నాల్ వేద పణ్ణగత్తాయ్” అంటే, – నాలుగు వేదాలకు కల రాగంలో భగవంతుడు వేంచేసి ఉన్నాడు –అని అర్థం. శ వేంకటాచలంలో ఏ విధంగా భగవంతుడు వేంచేసి ఉన్నాడో ఆ విధంగానే వేదంలో కూడా వేంచేసి ఉన్నాడు. “నాల్ వేదప్పణ్” అనేది కూడా భగవంతుని ఒక నివాస స్థానం –అని అంటున్నారు.

“నన్గు ఓదుమ్ నాల్వేద త్తుళ్ళాన్” అని అంటున్నారు పేయాళ్వార్లు. “మఱైయాయ నాల్వేదత్తుళ్ నిన్ఱ మలర్ చ్చుడరే” అని నమ్మాళ్వారులు అన్నారు. ఈ విధంగా, వేదం, సముద్రం అనే ఈ రెండు భగవంతునకు నివాస స్థానాలు. అందువల్ల సముద్ర దృష్టాంతం ద్వారా వేద మహిమ మనకు చక్కగా తెలుస్తున్నది.

ఇంతవరకు సముద్రానికి, వేదానికి మధ్య ఉండే నాలుగు విధాలైన సామ్యాలను గమనించాము. ఇప్పుడు ఐదవ సామ్యాన్ని గమనిద్దాం. ఈ సామ్యాన్ని నమ్మాళ్వార్ల తిరువాయ్ మొ*ళ్రి* ప్రబంధం ద్వారా గమనిద్దాం. ఈ ప్రబంధంలో వారు ఏమంటున్నారు అంటే, వేద ధ్వని, సముద్ర ధ్వని ఒకే విధంగా ఉన్నాయి –అని అంటున్నారు. “పాడు నల్ వేద ఒలి పరవై త్తిరైపోల్ ము*ళ్రు*జ్గ” అనేది ఆ సూక్తి. ఇక్కడ “పరవై “అంటే –సముద్రం, “తిరై” అంటే –కెరటం, సముద్ర కెరటాల వలె ధ్వనిస్తున్నది, “ఈ దివ్యదేశంలోని “పాడు నల్వేద ఒలి” – అనుసంధింపబడే చక్కని వేద ధ్వని– అక్కడ

ధ్వనించే సముద్రంలోని అలల ధ్వని వలె ఉన్నది –అని ఇక్కడ ఆళ్వార్లు అంటున్నారు.

ఇదే విధంగా, ఇంకొక చోట కూడా, "వేద క్కడలొలిపోల ఎంగుమ్ ఎఱ్ఱున్ద నల్ వేదత్తొలి నిన్ఱోంగు" అని అంటున్నారు. వేద ధ్వనికి, సముద్రధ్వనికి మధ్య ఇక్కడ నాలుగు విధాలైన సామ్యాలను వారు తెలియజేస్తున్నారు. ఈ రెండు "వేద ఒలి" , ఈ రెండు "ఓంగు ఒలి" , ఈ రెండు "ఎఱ్ఱున్ద ఒలి" , ఈ రెండు "నల్వొలి ". (ఈ రెండు వేదధ్వనులు, ఈ రెండు ఉన్నతంగా ధ్వనించే ధ్వనులు, ఈ రెండు ఆవిర్భవించిన ధ్వనులు, ఈ రెండు పవిత్రమైన ధ్వనులు). వీటిలో "వేద ఒలి" – అనేదానిని మాత్రం వివరించవలసి ఉన్నది. ఈ రెండు వేద ఒలి–అంటే ఏమి అర్థమంటే, వేదాన్ని మనం అధ్యయనం చేస్తున్నాము. ద్రావిడంలో అధ్యయనం చేయడానికి "ఓదుదల్" అని పేరు. అందుచేత వేద ధ్వని "ఓద ధ్వని" అవుతున్నది – అంటే, అధ్యయనం చేయబడే ధ్వని అవుతున్నది. ఇక, సముద్రపక్షంలో ఏమి అర్థం? అంటే, ఓదం అంటేనే జల రాశి –సముద్రం –అని అర్థం. అందువల్ల సముద్రం నుండి వచ్చే ధ్వనికి "ఓద ఒలి" అని పేరు. వేదధ్వనికి, సముద్ర ధ్వనికి మధ్య ఈ విధంగా ఏర్పడిన నామసామ్యాన్ని బట్టి, చమత్కారంగా, వేద ఒలి కూడా ఓద ఒలి కనుక, సముద్ర ధ్వని కూడా ఓద ఒలి కనుక, సముద్రానికి, వేదానికి మధ్య ఉండే ఈ సామ్యాన్ని వాటి ధ్వనిద్వారా తెలియజేసినట్లు అయినది. ఈ విధంగా ఇంతవరకు వేదానికి, సముద్రానికి మధ్య అయిదు విధాలైన సామ్యాలను తెలియజేయబడ్డాయి.

చివరిగా ఆరవ సామ్యాన్ని గమనిద్దాం. ఈ సామ్యం ఏమంటే– వేదాన్ని, సముద్రాన్ని – ఈ రెండిటిని విబుధులు చిలికి, అమృతాన్ని పొందుతున్నారు –అనేది. "నిర్మథ్య బహుధాలోడ్య వేదశాస్త్రాంబుధిం సుధీః, ద్వైపాయనో యదాసాద్య గీతా శాస్త్రం నిసృష్టవాన్" అని ఈ శ్లోకం పాద్మపురాణంలో ఉన్నది. వేదశాస్త్రం అనేది ఒక సముద్రం. ఈ సముద్రాన్ని బుద్ధిమంతుడైన ద్వైపాయనుడు అనేక విధాలుగా, చక్కగా చిలికాడు. అప్పుడు గీతాశాస్త్రం అనే అమృతాన్ని సృష్టించాడు. ఈ గీతాశాస్త్రం అనేది వేద

సాగరాన్ని చక్కగా చిలికినప్పుడు ఆవిర్భవించిన అమృతం అని పై పురాణ శ్లోకంలోని తాత్పర్యం. ఇదే అర్థాన్ని, అంటే, వేద సముద్రంనుండి ఆవిర్భవించిన అమృతమే గీత– అనే అర్థాన్ని ఇంకా కొందరు కవులు కూడా చెప్పారు.

ఈ విధంగా ఇంతవరకు వేదానికి, సముద్రానికి మధ్య ఉండే సామ్యాలను సంగ్రహంగా గమనించాము.

హరిః ఓమ్,

బ్రహ్మ ప్రావాదిష్మ, తన్మో మాహాసీత్.

హరిః ఓమ్.

మేము వేదాన్ని అధ్యయనం చేస్తున్నాము, ఆ వేదం మమ్మలను రక్షించుగాక.



పానకాల నరసింహస్వామి, మంగళగిరి

## వేదం సూర్యుడు

వేదం సూర్యుని వంటిది అనే పోలికను ఆధారంగా చేసికొని కొన్ని వేద మహిమలను గమనిద్దాం.

వేదాన్ని సూర్యునితో కలిపి చెప్పడం అనేది వేదంలోనే ఆరంభమైనది. సూర్యసంచారం వేదంతో కలిసే జరుగుతున్నది– అని కాఠకం పలుకుతున్నది. “వేదై రశూన్య స్త్రిభి రేతి సూర్యః” అనేది ఒక మంత్రం. ఈ మంత్రంలోని అర్థాన్ని గమనిస్తే, ఉదయకాలంలో సూర్యుడు ఋగ్వేదంతో సంచరిస్తాడు, మధ్యాహ్నం సమయాల్లో యజుర్వేదంతో సంచరిస్తాడు, అస్తమయ సమయంలో సామవేదంతో సంచరిస్తాడు. ఈ విధంగా మూడువేళలలోను సూర్యుడు వేదంతో శూన్యుడు కాకుండా సంచరిస్తున్నాడు– అని అంటున్నది, ఈ మంత్రం. దీనివల్ల ఏమి తెలుస్తున్నది? అని అంటే, సూర్యసంచారానికి వేదం తోడ్పడుతున్నది –అని తెలుస్తున్నది.

వాస్తవానికి వేదమే సూర్యుని రూపాన్ని పొంది సంచరిస్తున్నది. ఈ విషయాన్ని కూడా వేదమే తెలుపుతున్నది. “ఆదిత్యో వా ఏష ఏతన్మండలం తపతి సైషా త్రయ్యేవ విద్యా తపతి” . త్రయీ విద్యా అని వేదానికి పేరు. అదియే ఆదిత్య మండలమై ప్రకాశిస్తున్నది –అని వేదం తెలుపుతున్నది.

ఈ వేదార్థాన్ని కొన్ని సమయాలలో స్పష్టంగా గ్రహించడానికి సాధ్యం కాదు. వేదమే సూర్యునిగా అవుతున్నది అని కానీ, సూర్యుడే వేదంగా అవుతున్నాడు అని కానీ అంటే, దానికి ఏమి తాత్పర్యం? అనే విషయం చటుక్కున అర్థం కావడం లేదు. అందువల్ల వేదం సూర్యుని వంటిది అనే పోలికతో పలుకుతూ, అందులోని కొన్ని విశేషాలను గమనిద్దాం.

మొదట మనకి ఏమని తోస్తున్నది? అంటే, వేదం శబ్దమయమైనది, శబ్దరూపమైనది. సూర్యుడు ప్రకాశరూపమైనవాడు. ఇక్కడ చమత్కారం ఏమంటే, ద్రావిడ భాషలో ఒలి అంటే –శబ్దం, ఒళి అంటే –కాంతి అని అర్థం ఈ రెండు పదాల ఉచ్చారణలో చాలా స్వల్పమైన భేదమే ఉన్నది. అయినప్పటికీ, చాలా తేడా ఉన్నది కదా. అప్పుడు, వేదం సూర్యుని వంటిది అని ఏ విధంగా చెప్పడానికి వీలున్నది? జ్యోతిస్సు, నాదం అనే ఈ రెండు ఏ విధంగా ఒకటిగా అయ్యే అవకాశం ఉన్నది? అనే ప్రశ్నలు కలుగవచ్చు.

దీనికి సమాధానం చెప్పేవారు ఏమంటారు అంటే, వేదం కూడా ఒక విధమైన జ్యోతి స్స్వరూపమే –అని. "యది శబ్దాహ్వయం జ్యోతిః ఆసంసారాన్న దీప్యతే" అనే దండి మహాకవి తన కావ్యా దర్శగ్రంథంలో అన్నాడు. శబ్దమనేది ఒక జ్యోతిస్సు అని అతడు అంటున్నాడు. ఈ జ్యోతిస్సు ఉంటేనే లోకం అంతా చీకటి కాకుండా ఉంటుంది –అనికూడా అంటున్నాడు.

దండి చెప్పిన మాట అటు ఉండనివ్వండి, మన సంప్రదాయంలో కూడా, "శుడర్ మికు శురుదియుళ్ ఇవై యుండ శురనే" అనే తిరువాయ్ మొழி దివ్య ప్రబంధ సూక్తిలో "శుడర్ మికు శురుది" అని అనబడింది కదా. దీనివల్ల వేదంలో జ్యోతిస్సు ఉన్నది– అని చెప్పబడింది కదా. ఆ విధంగా ఏ జ్యోతిస్సు ఉన్నది ?అంటే, అందులో ఉండే జ్యోతిస్సు ప్రామాణ్య రూపమైన జ్యోతిస్సు. అది అందులో ఉన్నందువల్లనే మనకు నిత్య నూతనమైన వస్తువులు తన్మూలంగా మనకు సదా తెలుస్తున్నవి. మనకు సదా అజ్ఞానం అనే అంధకారం లేకుండా పోతున్నది –అని ఈ విధంగా వేదంలో జ్యోతిస్సు ఉన్నది అని అనడానికి గల కారణాన్ని కూడా వారు తెలియజేస్తున్నారు.

వేదంలో తేజస్సు ఉన్నదని, అది అబాధితమైన ప్రామాణ్యరూపమైన తేజస్సు అని పిళ్ళాన్ అనుగ్రహించారు. ప్రత్యక్షం అనుమానంవలె, వేదం కూడా వస్తుగ్రహణానికి

ఆధారం అవుతున్నది. అందులో తేజస్సు ఉన్నదని దానివల్ల అంటున్నాము –అని ఈ ఆచార్యుల అభిప్రాయం. ఏ విధంగా అయినా, వేదం అనేదికూడా సూర్యుని వలె తేజస్సును కలిగినది– అని మాత్రమే కాకుండా, సూర్యుడే వేదమయుడు అని కూడా వీరు సాధిస్తున్నారు.

వాస్తవానికి వేదం వేరు, సూర్యుడు వేరు అయినప్పటికీ, సూర్యుడు వేదమయుడు. వేదానికి ఒక తేజో రూపాన్ని ఇస్తే, అది సూర్యునిగా అవుతుంది. ఆ విధంగా అయితే, వేదానికి సూర్యునకు మధ్య అనేక విధాలైన పోలికలు ఉండాలి కదా. వాటిలో కొన్నిటిని మనం యథార్థాన్ని తెలిసికోవడం కోసం, మరి కొన్ని చమత్కారం కోసం గమనిద్దాం.

వేదమనే సూర్యుడు– అనే ఉపమానం పలు గ్రంథాలలో అనేకమార్లు చెప్పబడుతున్నది కదా. అందులోని సామంజస్యాలను కొన్నిటిని గమనిద్దాం.

మొదటి సామ్యం ఏమంటే– వేదం, సూర్యుడు– అనే ఈ రెండు చీకటిని పోగొడతాయి. సూర్యుడు అస్తమిస్తే చీకటి ఆవరిస్తుంది అనే విషయం మనకందరకు తెలుసు. వేదం అంతర్హితమైతే కూడా ఆ విధంగానే చీకటి కమ్ముకుంటుంది అని అంటున్నారు, దివ్యసూరులు. "తుణ్ణియ పేరిరుళ్ శూழ்న్దులకై మూడ, మన్నియ నాన్మఱై ముற்றుమ్ మఱైందిడ పిన్నివ్వులకినిల్ పేరిరుళ్ నీంగ అన్నన్నమదానానే అచ్చో వచ్చో, అరుమఱై తందానే అచ్చో వచ్చో" అని పెరియాళ్వార్ల శ్రీ సూక్తి. వేదం లేకుండా పోతే అంతటా చీకటి ఆవరిస్తుందట. అదేవిధంగా, పెరియతిరుమొழி ప్రబంధంలో తిరుమంగై ఆళ్వార్లు కూడా "మున్నివ్వులకేழ ముమిరుళ్ మండి ఉణ్ణ మునివరొడు దానవర్ కళ్ తికైప్ప వందు పన్నుకలై నాల్ వేద ప్పొరుళై ఎల్లామ్ పరి ముకమాయ్ అరుళియ నమ్ పరమన్ కాణ్మిన్" అని అంటూ వేదం అంతర్హితమైనందున చీకటి ఆవరించింది– అని అన్నారు దీనికి అంతటికి మూలమైన పురాణాలలోనూ,

ఇతిహాసాలలోను కూడా ఈ విధంగానే ఉన్నది. వేదాలను కోల్పోయిన బ్రహ్మ "అయ్యో! ఈ లోకం అంతా నాకు చీకటి అయిపోయింది "అని దుఃఖించాడు. ఈ విధంగా వేదమైనా సరే, సూర్యుడు అయినా సరే, అంతరించిపోతే, చీకటి వ్యాపిస్తుంది. మళ్లీ వారు ఉదయించినప్పుడు తేజస్సు వస్తుంది –అని తెలుస్తున్నది.

రెండవ సామ్యం ఏమంటే, వేదం పవిత్రమైనది, అదేవిధంగా సూర్యునకు కూడా పవిత్రమై ఉండే స్వభావం ఉన్నది –అనేది. వేదం పవిత్రమైనది, పరిశుద్ధమైనది –అనే విషయం" తూయ నాన్మఱైయాళర్ శోము చ్చెయ్య" అనితిరుమంగై అళ్వార్ పలుకుతున్నారు. సూర్యుడు పవిత్రుడు అనే విషయం "సైషా త్రయ్యేవ విద్యా తపతి రవిమయీ సర్వలోకాన్ పునానాన్" అని వేంకటాధ్వరి అనే మహాకవి పలుకుతున్నారు. సూర్యుడు అన్ని లోకాలను పవిత్రం చేసే దేవత. వేదవిద్యయే సూర్యుని రూపంలో ఉన్నది– అని ఈ కవి భావం.

ఇంకొక సామ్యం ఏమంటే –వేదమని భగవంతునకు పేరు, సూర్యుడని కూడా భగవంతుని పేరే. "వేదో వేదవిదవ్యంగః" అని, "రవిర్విరోచనః సూర్యః" అనే శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రంలోని సూక్తులను గమనిస్తే, వేదం అనేది, సూర్యుడనేది భగవంతుని నామాలే అని తెలుస్తున్నది. ఈ విధంగా కూడా వేదానికి, సూర్యునకు సామ్యం ఉన్నది.

వేదంలోనూ, సూర్యునిలోను భగవంతుడు వేంచేసి ఉంటాడు– అనే విషయాన్ని "మఱైయాయ నాల్ వేదత్తుళ్ నిన్ఱ మలర్ చ్చుడరే" అనే ఆళ్వారుల సూక్తి తెలియజేస్తున్నది. సూర్యునిలో భగవంతుడు అధివసించి ఉంటాడు అనే విషయం "ధ్యేయః సదా సవితృ మండల మధ్యవర్తీ నారాయణః" అని ప్రతి దినం మనం సంధ్యావందన సమయంలో ఉపస్థాన క్రమంలో అనుసంధించే శ్లోకం తెలుపుతున్నది.

వేదానికి, సూర్యునకు మధ్య ఉండే మరొక సామ్యం ఏమంటే— ఈ రెండిటికి రవి అనే పేరు ఉన్నది— అనేది. సూర్యునకు రవి అనే నామం ఉన్న విషయం అందరికీ తెలిసినదే. కానీ, వేదానికి రవి అనే పేరు ఉన్నట్లు ఎక్కడ తెలియలేదే? అని అంటే, ఆ పేరు వేదానికి పొసగుతుంది —అని అంటారు, వరదరాజస్తవంలో, అప్పయ్య దీక్షితులు. రవం అంటే శబ్దం. శబ్దాన్ని కలిగినది రవి. వేదం కూడా శబ్దమయమైనది కనుక, అది రవి అవుతున్నది —అని చమత్కారంగా వారు సమర్థిస్తారు. ఇది ఒక ఉక్తి చమత్కారం.

చివరిగా మరొక విషయం. వేదం, రవి— అనే ఈ రెండు చక్కగా ప్రకాశించేటప్పుడు కన్నులకు మిరుమిట్లు కలిగిస్తాయి. ఈ విషయాన్ని శ్రీదేశికులు మీమాంసాపాదుకా అనే గ్రంథంలో ఈ విధంగా అంటున్నారు. “వేదాదిత్యప్రకాశ ప్రతిహతమతిభిః దృష్టిభిః తాదృశానాం, ధర్మాధర్మవ్యవస్థా దురధిగమతమా దోషమాలావిలాభిః” అనేది ఆ సూక్తి. దీని అర్థం ఏమంటే— వేదమనే సూర్యుడు చక్కగా ప్రకాశించేటప్పుడు వేగంగా కొంతమందికి కళ్ళకు మిరుమిట్లు గొలుపుతాయి. వారికి సహజంగానే దృష్టిలో ఏదో దోషం ఉన్నది. దానివల్ల వారి దృష్టి వేద ప్రకాశించేత అవరుద్ధం అవుతుంది. ఈ విధంగా దోషాలు నిండినవారి చూపులకు ఏది ధర్మం? ఏది ఆధర్మం? అని వివేకించి, ధర్మాధర్మ వ్యవస్థను తెలుసుకునే శక్తి లేకుండా పోతుంది. అందుచేత వారు వేదం విషయంలో అపచార పడుతున్నారు. కుదృష్టుల నేత్రాలకు మిరుమిట్లు కలిగిస్తున్నది, సూర్యుని వంటి వేదం— అని అంటున్నారు.

ఈ విధంగా ఇంతవరకు వేదానికి, సూర్యునకు మధ్య ఉండే కొన్ని చమత్కారకరాలైన సామ్యాలను గమనించాము. తద్ద్వారా వేద మహిమను తెలిసికోగలిగాము. వేదంలో ప్రామాణ్యం, జ్వలించే గొప్పతనం అంతరిస్తే లోకంలో అంతట అంధకారం వ్యాపించే వేద మహిమ, అందరిని పవిత్రులను చేసే మహిమ, భగవంతునకు నివాస స్థానమై ఉండే మహిమ, కుదృష్టుల చూపులకు మిరుమిట్లు కలిగించే గొప్పతనం —అనే ఈ గొప్పతనాలు వేదానికి ఉన్నాయి—అనే విషయాన్ని తెలుసుకోగలిగాము.



శ్రీజ్వాలా నరసింహస్వామి, మాల్యాద్రి

## వేదనేత్రం

వేదం గొప్ప నేత్రంవంటిది. ఈ విధమైన ఉపమానాన్ని ఎవరు చెప్పారు? అని అంటే, విదుర నీతి, మనుస్మృతి హయ శిర ఉపాఖ్యానం, వాధూలస్మృతి, నైషధీయ చరితం, ఉత్తర చంపు, శ్రీరంగ రాజస్తవం, యాదవాభ్యుదయం, దేహళీశ స్తుతి, దేశిక ప్రబంధం అని ఈ విధంగా ఎన్నో గ్రంథాలలో ఈ విధమైన ఉపమానం మనకు కనిపిస్తుంది. సామాన్యంగా గమనించినప్పుడే ఇన్ని విధాలైన ఆకరాలు కనిపిస్తే, ఇక, లోతుగా నిశితంగా గమనిస్తే మరెన్ని కనిపిస్తాయో కదా. వేదాన్ని కంటితో సమానంగా పోల్చడంలో ఉండే తాత్పర్యమేమి? అనే విషయాన్ని గమనించినప్పుడు కూడా, దానికి తగిన సమాధానాలు కూడా అక్కడే అక్కడే కనిపిస్తాయి.

మనం, ఏ వస్తువును చూడాలని కోరుకుంటామో దానికి అనుగుణంగా మన నేత్రం కూడా మారుతుంది –అని అంటున్నది విదుర నీతి. “గంధేన గావః పశ్యంతి వేదైః ప్రశ్యంతి బ్రాహ్మణాః, చారైః ప్రశ్యంతి రాజానః చక్షుర్భ్యా మితరే జనాః” – జంతువులు వాసన ద్వారా విషయాలను చూస్తాయి, అంటే, తెలిసి కొంటాయి. వేదం ద్వారా బ్రాహ్మణులు చూస్తున్నారు, అంటే, విషయాన్ని తెలుసుకుంటున్నారు. ప్రభువులు గూఢచారుల ద్వారా తెలుసుకుంటున్నారు. ఇక, సామాన్య మానవులు తమ నేత్రాలతో దర్శిస్తున్నారు.

ఆ విధంగానే, వారు వారు చూచే విషయం కూడా వేరు వేరుగానే ఉంటుంది. జంతువులు తమ ఎరను గంధం ద్వారా చూస్తాయి. బ్రాహ్మణులు అతీంద్రియాలైన వస్తువులను వేదం ద్వారా దర్శిస్తారు. రాజులు తమ శత్రు రాజుల సంగతులను గూఢచారుల ద్వారా చూస్తారు. సామాన్య మానవులు తమ కంటి ముందు ఉండే వస్తువులను తమ నేత్రాలతో చూస్తారు.

మనం దేనిని చూడ కోరుతున్నామో, దానికి తగినట్లు మన నేత్రాన్ని మార్చుకోవాలి. పరలోకం, పరమాత్మ మొదలైన విషయాలను మనం దర్శించాలని అనుకుంటే, వాటిని మనం వేదం ద్వారా దర్శించాలి. వేదాన్ని కంటితో సమానంగా చెప్పే వారి దృష్టి ఏమంటే, ఆవేదంలోని ప్రాధాన్యంలో దృష్టి. “సర్వేంద్రియాణాం నయనం

ప్రధానమ్" అనే ఒక సంస్కృతసామెత ఉన్నది. దీని అర్థం ఏమంటే, మనకు ఉండే అన్ని ఇంద్రియాలలోను కన్ను ప్రధానమైన ఇంద్రియం అని. ఆ విధంగానే, మనకు ఉండే అన్ని ప్రమాణాలలోనూ వేదమే ముఖ్యమైన ప్రమాణం. అందుచేత, అన్ని ఇంద్రియాలలో ప్రధానమైన కంటితో సమానంగా, అన్ని ప్రమాణాలలో క్రమ ప్రధానమైన వేదాన్ని చెప్పడం తగినది కదా.

మహాభారతంలో హయాశిర ఉపాఖ్యానం అనే ఒక కథ ఉన్నది. ఆ ఉపాఖ్యానం హయగ్రీవృత్తాంతాన్ని తెలియజేస్తున్నది. ఆ వృత్తాంతంలో– బ్రహ్మ అసురుల వల్ల తన వద్ద ఉండే వేదాలను పోగొట్టుకున్నట్లు తెలుపబడింది. ఆ విధంగా వేదాలను పోగొట్టుకున్న బ్రహ్మ ఏమని బాధపడ్డాడు? అంటే, "వేదా మే పరమం చక్షుః వేదా మే పరమం ధనమ్" అని. వేదాలు నాకు గొప్ప కన్ను వేదాలు నాకు గొప్పదనం. "అంధకారమయా జాతాః లోకా వేద వివర్జితాః" – వేదాలు లేని ఈ లోకం నాకు చీకటిమయంగా తోస్తున్నది. "అహో!బత! మహద్దుఃఖం వేదనాశనజం మమ" –అయ్యో!!అయ్యో!వేదాలను పోగొట్టుకున్నందున నాకు చాలా దుఃఖం కలుగుతున్నది. "అని బ్రహ్మ చాలా బాధపడ్డాడు ఈ బ్రహ్మ వచనాలలో మొదట వేదం గొప్పనేత్రం అని చెప్పబడింది. కంటిని పోగొట్టుకున్న వానికి లోకం అంతా చీకటిగా తోస్తుంది కదా. ఆ విధంగానే, వేదనేత్రాన్ని పోగొట్టుకున్న వానికి లోకం అంతా చీకటిగా తోచడం సహజమే.

వేదం ఎవరికి నేత్రం అవుతున్నది? పై కథలో బ్రహ్మ వేదం తనకు నేత్రమని అన్నాడు. "లోకత్రాయీం త్రయీనేత్రామ్" అని మహాకావ్యాలలో ఒకటి అయిన నైషధీయచరితం పలుకుతున్నది. మూడు లోకాలకు వేదం నేత్రమట. అందువల్లనే మనుస్మృతిలో "పితృదేవమనుష్యాణాం వేదః చక్షుః సనాతనమ్" అనే ఒక వచనం ఉన్నది. పితృదేవతలకు దేవతలకు మానవులకు వేదమనేది గొప్ప నేత్రంగా ఉన్నది– అని ఈ స్మృతి వచనం తెలుపుతున్నది.

వేరువేరు వస్తువులను చూడడం కోసం వేరు వేరు నేత్రాలు ఆవశ్యకం అనేది పైన మనం చూసిన విదురనీతి వచనంలోని తాత్పర్యం. ఆ విధంగా అయితే, వేద నేత్రంతో మనం దర్శించే వస్తువులు ఏమేమి? అనే ప్రశ్న కలుగుతుంది కదా. దీనికి సమాధానంగా మనం ఇప్పుడు దేశికుల గ్రంథాల నుండి రెండు సూక్తులను గమనిద్దాం. అందులో మొదటిది –యాదవభ్యుదయ మహాకావ్యం లోనిది. "అధిలక్ష్య మనుశ్రవేక్షణైః "అనే విధంగా భగవంతుడు వేదమనే నేత్రంతో దర్శించదగినవాడు. మాంసచక్షువులతో మనం భగవంతుని దర్శించలేము –అని ఉపనిషత్తు "న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్" అని ఏ భగవంతుని గూర్చి పలుకుతున్నదో, ఆ భగవంతునే వేదమనే నేత్రంతో మనం దర్శించవచ్చు అని ఇక్కడ భవం. దేశికుల ప్రధానశతకం అనే చిల్లర రహస్యంలో "పారలౌకిక పురుషార్థ తదుపాయంగళై యథావస్థితమాక కాట్టుకిఱ వేదమ్ ప్రధానమ్" అనే ఒక సూక్తిని అనుగ్రహించారు. పరలోకాలు, ఆ లోకాలలో పొందబడే ప్రయోజనాలు, వాటిని పొందడానికి తగిన ఉపాయాలు– అనే వీటిని అన్నిటిని యథాతథంగా తెలియజేసేది, వేదం– అని పై వాక్యంలోని తాత్పర్యం. మన కంటికి ఎదురుగా ఉండే వస్తువులను కన్ను చూపించేటట్లే, వేదం కంటికి కనిపించని పలు వస్తువులను గురించి మనకు చూపిస్తున్నది– అని తెలుస్తున్నది. వేదాన్ని కంటితో సమానంగా చెప్పడానికి ఇదే ముఖ్యమైన కారణం. ఇంతకుముందు, వేదం లేకపోతే లోకమంతా చీకటై పోతుందని, వేదం ప్రధానమై ఉన్నదని రెండు విధాలుగా ఉండే సామ్యాలను మనం గమనించాము.

వేదం నేత్రంతో సమానమై ఉన్నదనే భావం అనేకమైన కల్పనలకు అవకాశం ఇస్తున్నది. కన్నులనేవి సంఖ్యలో రెండుగా ఉంటాయి కదా! కానీ వేదం ఒకటిగానే ఉన్నది కదా. సామ్యం ఏ విధంగా ఈ రెండిటి మధ్య కుదురుతుంది? ఇందువల్ల వేదంతో పాటు ఇంకొకటిని కూడా కలుపుకుని ఈ సంఖ్యలో సామ్యాన్ని సమర్థించవచ్చునా! అనే ఆలోచన కొంతమందికి కలిగినది. వేదం కన్ను వంటిది –అని అంటే, ఏది కనుగుడ్డు వంటిది? ఏది రెప్ప వంటిది? ఏ విధంగా చెప్పి మీ సామ్యాన్ని సమర్థించవచ్చునా! అని ఈ విధంగా కొందరు ఆలోచించారు వేదానికి శ్రుతి అనే పేరు ఉన్నందున, శ్రుతి అంటే సంస్కృతంలో చెవి అనే అర్థం ఉన్నందున, శ్రుతి కన్ను వంటిది –అనే సరసమైన అర్థం

లభిస్తున్నందున, కన్ను చెవి వంటివి —అనే అర్థాన్ని గ్రహించవచ్చు కనుక, దీనిని ఆధారంగా చేసుకుని చమత్కారంగా చెప్పవచ్చు కదా— అని కొందరు ప్రయత్నించారు. ఈ విధంగా వేదం కన్ను వంటిది అనే మూలభావంనుండి అనేకమైన శాఖోప శాఖలుగా భావాలు విస్తరించడానికి అవకాశం ఏర్పడింది. వాటిలో కొన్నిటిని ఇప్పుడు మనం గమనిద్దాం.

"శృతిస్మృతీ తు విప్రాణాం చక్షుషీ ద్వే వినిర్మితే" అనేది ఒక సూక్తి. విప్రులకు వేదాలు, స్మృతులు— అనేవి రెండు కళ్ళు అయ్యేటట్లు నిర్మింపబడ్డాయి —అనే అర్థం దీనివల్ల వస్తున్నది. ఈ వచనం వాధూల స్మృతిలో ఉన్నది.

ఇదే భావాన్ని "శ్రుతిః స్మృతిశ్చ విప్రాణాం నయనే ద్వే ప్రకీర్తితే, కాణ స్తదేకయా హీనః ద్వాభ్యా మంధః ప్రకీర్తితః" — శ్రుతి, స్మృతి అనే ఈ రెండు రెండు కన్నులుగా బ్రాహ్మణులకు చెప్పబడ్డాయి. వీటిలో ఒక కన్ను లేనివాడు కాణుడు అని, , రెండు కళ్ళు లేనివాడు అంధుడు —అని చెప్పబడుతున్నాడు— అని పరాశరస్మృతి తెలుపుతున్నది.

"స్వాధ్యాయ యోగనయనాః శ్రుతయః కవీంద్రాః" అని దేహలీశ స్తుతిలో స్వాధ్యాయ మనే వేదాన్ని, యోగాన్ని రెండు నేత్రాలుగా ముదలాళ్వార్లకు అయినవి అని దేశికులు పలికారు. ఈ రెండు నేత్రాలతో దర్శించే వస్తువు ఒకటే, అదే పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు.

తరువాత, "వేదం కన్ను వంటిది" అనే విషయంలో ఉపమాపరంపరను గమనిద్దాం. వేదం నేత్రం వంటిది అయితే, ఆ నేత్రంలో ఉండే కనుగుడ్డు ఏది? కనుగుడ్డు కంటి లోపల ఉంటుంది కదా! "మఱైయాయ నాల్వేదత్తుళ్ నిన్ఱ మలర్ చ్చుడరే!" (నాలుగు వేదాలలోపల ఉండి వికసించే జ్యోతి స్స్వరూపా!) అనే ఆళ్వారుల పాశురాన్ని పురస్కరించుకుని గమనిస్తే, భగవంతుడే వేదంలోపల ఉంటాడు. అందువల్లనే వేదాంత దేశికులు కూడా "విழியొప్పార్ వేదనెనుమ్ కణ్ తనక్కు" (వేదమనే నేత్రానికి కనుగుడ్డు వంటివాడు) అని అన్నారు.

తరువాత, "చెవి కన్ను వంటిది" అనే చమత్కారమైన అర్థానికి ఒకే ఒక్క ఉదాహరణ మాత్రం ప్రస్తావింపబడుతున్నది. ఉత్తర చంపువు అనే ఒక గొప్ప కావ్యాన్ని అరశాణిపాలెం వేంకటాధ్వరి అనే మహాకవి రచించారు. అందులో శ్రీరామచంద్రుని గొప్పతనాన్ని గూర్చి చెబుతూ శృతిని కన్నుగా కలిగినయోగుల చేత కూడా అది పలుకడానికి సాధ్యం కాదు, నేత్రాలనే చెవులుగా కలిగిన ఆదిశేషుని వల్ల కూడా పూర్ణంగా వర్ణించడానికి సాధ్యం కాదు —అని అంటూ, శ్రుతి నేత్రంవలె ఉన్నది, యోగులకందరకు ఆ వేదమే నేత్రం అవుతున్నది, ఆ విధంగా వేదాన్ని నేత్రంగా కలిగిన యోగుల చేత కూడా రామచంద్ర మూర్తి వైభవం వర్ణించడానికి సాధ్యం కానిది, ఆ విధంగానే, ఆ నేత్రాన్ని చెవిగా కలిగిన సర్పమైన ఆదిశేషునిచే కూడా వర్ణించడానికి సత్యం కానిది– అని వేంకటాధ్వరి చమత్కారంగా అంటారు.

ఈ విధంగా వేదాన్ని కంటితో పోలుస్తూ పలకడంలోని స్వారస్యం ఏమంటే —వేదం నేత్రం వలె ప్రధానం వేదం కన్ను వలె ప్రమాణం, కంటికి ఏ హాని కలుగకుండా కనురెప్పలతో కాపాడుకునేటట్లే, వేదానికి ఏ విధమైన హాని కలగకుండా మనం అన్ని విధాలుగా ప్రయత్నించి రక్షించుకోవాలి —అని.

హరిః ఓమ్, బ్రహ్మ ప్రావాదిష్మ, తన్నో మాహాసీత్. హరిః ఓమ్.

మేము వేదాన్ని అధ్యయనం చేస్తున్నాము, ఆ వేదం మమ్మలను రక్షించుగాక.



వరాహ లక్ష్మీనరసింహస్వామి, శింగరాయకొండ

# వేదవృక్షం

"వేదం ఒక వృక్షం వంటిది" అనే ఉపమానాన్ని పురస్కరించుకుని వేదవైభవం కొంచెం విన్నవింపబడుతున్నది. వేద వృక్షం అని, "ఆమ్నాయ మహా ద్రుమాణామ్" అని, "నిగమద్రుమాణామ్" అని, "బ్రహ్మ వృక్ష" మని, "వేదపాదప" మని ఎన్నో సూక్తులు ఉన్నాయి. ఇవి అన్నీ వేదం వృక్షం వంటిది అనే విషయాన్ని మనకు ఒక చక్కని ఉపమానం ద్వారా తెలియజేస్తున్నాయి. ఈ సూక్తులన్నీ వేర్వేరు గ్రంథాలలో ఉన్నాయి. మహాభారతంనుండి, భాగవతం నుండి, వేదాంతదేశికుల యతిరాజ సప్తతి, వరదరాజ పంచాశత్ మొదలైన గ్రంథాల నుండి ప్రస్తుతింపబడే ఈ సూక్తులు అన్నీ వేదం ఒక వృక్షంవంటిది అనే ఉపమానాన్ని మనకు తెలియజేస్తున్నాయి.

వేదం అనే వృక్షాన్ని మనం రక్షించినట్లయితే అది మనకు ఏమి ఫలాన్ని ఇస్తుంది? అనే ప్రశ్న చేసికొని. మహాభారతంలోని శాంతిపర్వంలో ఉండే ఒక శ్లోకం మనకు చక్కని సమాధానాన్ని ఇస్తున్నది, ఆ శ్లోకం ఏమంటే– "బ్రహ్మ వృక్షో రక్ష్యమాణో మధు హేమ చ వర్షతి" అనేది ఆ శ్లోకం. దీని అర్థం ఏమంటే –వేదం అనే వృక్షాన్ని మనం రక్షించినట్లయితే, ఆ వేద వృక్షం మనకు మధువును, హేమను, అంటే, బంగారాన్ని మనకు వర్షిస్తుంది అని. ఈ వేదం అనే వృక్షం మామూలు వృక్షం కాదు. ఇది ఒక విలక్షణమైన వృక్షం సాధారణ వృక్షాల కంటే వేరయినది, వేరైన ఫలాలను ఇస్తున్నది.

లోకంలో సాధారణ వృక్షాలను రక్షించినట్లయితే, వాటి వల్ల మనకు కాయలు, పళ్ళు, పూలు మొదలైనవి లభిస్తాయి. కానీ, వేదమనే ఈ విలక్షణమైన వృక్షాన్ని రక్షించినట్లయితే, మనకు అది మధువును, బంగారాన్ని వర్షిస్తుంది. – అని వ్యాసమహర్షి తెలియజేస్తున్నారు, ఇక్కడ తేనె అనేది సకల విధాలయిన భోగ్యపదార్థాలకు ఉప లక్షణం, బంగారమనేది అన్ని విధాలైన ఉత్కృష్ట వస్తువులకు ఉప లక్షణం. వేదం నుండి తేనె, బంగారం లభిస్తుంది అని అంటే, మనకు వేదం వల్ల అన్ని

విధాలైన, మనం కోరిన భోగ్య వస్తువులు, రత్నాల వంటి ఉత్కృష్టమైన వస్తువులు లభిస్తాయి— అని దీనివల్ల చెప్పబడినట్లయిది.

వృక్షాన్ని రక్షించినట్లుగానే వేదాన్ని కూడా రక్షించాలి —అని ఈ శ్లోకం మనకు తెలియజేస్తున్నది. చెట్టును ఏ విధంగా రక్షించాలి? అనే సంగతి మనకు తెలుసు. దానికి నీరు పోసి, ఎరువును వేసి, పెంచి రక్షించాలి. దాన్ని నరకడానికి ఎవరైనా వస్తే, వారికి బెదిరించి, దూరంగా తరిమి వేయాలి.

ఆ విధంగా అనే వేద వృక్షాన్ని రక్షించడం ఏ విధంగా? అని మనం ప్రశ్నను చేసుకున్నప్పుడు, వేదం అనే దానిని 1) మనం మరచిపోకుండా రక్షించాలి, 2) మారకుండా రక్షించాలి, 2) అదృశ్యం కాకుండా రక్షించాలి, 4) గోప్యంగా రక్షించాలి. —అని ఈ విధంగా నాలుగు విధాలుగా వేద వృక్షాన్ని రక్షించాలి.

వేదాన్ని మరచిపోకుండా రక్షించడం అంటే— తమ దగ్గరకు వచ్చిన శిష్యులకు వేదాన్ని బోధించి, దానిని అదృశ్యం కాకుండా ఉండేటట్లు రక్షించడం. మారకుండా రక్షించడం అంటే— వేదంలో ఉండే స్వరంగాని, అక్షరం కానీ ఏ విధమైన మార్పు లేకుండా ఉండేటట్లు, ఉచ్చారణలో ఏ విధమైన మార్పు లేకుండా ఉండేటట్లు కాపాడడం. మరిచిపోకుండా రక్షించడం అంటే —ప్రతి దినం వేదాన్ని మనం భక్తిశ్రద్ధలతో అధ్యయనం చేస్తూ, దానిని మనం మరచిపోకుండా ఉండేటట్లు రక్షించడం, గోప్యంగా ఉంచి రక్షించడం అంటే — యోగ్యత లేనివారికి దానిని చెప్పకుండా, వారికి తెలియకుండా ఉండేటట్లు రహస్యంగా దాచి రక్షించడం.

ఈ విధంగా మనం వేదాన్ని మనం నిత్యం బోధించి, దానిలో ఏ మార్పు లేకుండా ఉండేటట్లు రక్షించి, భక్తిశ్రద్ధలతో అధ్యయనం చేసి, అయోగ్యులకు తెలియకుండా కాపాడి రక్షించినట్లయితే ఏమి ఫలం కలుగుతుంది? అని అంటే, వృక్షాన్ని రక్షించిన

వానికి ఫలం కలిగేటట్లే, వేద వృక్షాన్ని రక్షించిన వానికి కూడా విలక్షణమైన ఫలం కలుగుతుంది. లోకంలో వృక్షాన్ని రక్షించేవానికి దాని నుండి పూలు, కాయలు, పళ్ళు మొదలైనవి లభిస్తాయి. "యద్వృక్షా దంతరిక్షాత్ ఫల మభ్యపతతి" అని వేదమే వృక్షం నుండి ఫలం లభిస్తుందని మనకు తెలుపుతున్నది. ఆ విధంగానే, వేదవృక్షం నుండి దానిని రక్షించేవానికి ఏమి లభిస్తుంది? అని అంటే, తేనె, బంగారం మొదలైన అమూల్యమైన వస్తువులు లభిస్తాయి. అంటే, ఇతనికి గల వేదజ్ఞానం అనేది ఇతనికి పలు విధాలైన గొప్ప గొప్ప ప్రయోజనాలను కలుగజేస్తుంది– అని తాత్పర్యం. లోకంలో ఉండేవారు కూడా వేదాధ్యయన శీలుని, వేదజ్ఞాన సంపన్నుని చూచి, "ఇతడు చాలా యోగ్యుడు, మనం దానాన్ని ఇవ్వడానికి తగిన యోగ్యతను కలవాడు" అని భావించి, అతనికి మంచి మంచి దానాలను చేస్తారు.

వేదాన్ని మనం రక్షించినట్లయితే, వేదం కూడా మనలను విలక్షణమైన రీతిలో రక్షిస్తుంది. అందువల్ల వేదం అనే వృక్షాన్ని మనం రక్షిద్దాం –అని తెలియజేస్తున్నది మహాభారత శ్లోకం.

వేద వృక్షం అనేది సాధారణమైన వృక్షం కాదు. అది ఒక విలక్షణమైన కల్పవృక్షం. స్వర్గంలో ఉండే కల్పతరువు అడిగినవారికి అడిగినవానిని అన్నిటిని పుష్కలంగా ఇస్తుంది. అమూల్యమైన వస్తువులను అన్నిటినీ ఇస్తుంది. ఆ విధంగానే, ఈ వేదమనే కల్పవృక్షం కూడా ప్రార్థించినవారికి ప్రార్థించిన ఫలాలను అన్నిటినీ ఇస్తుంది– అని తెలుపుతున్నది ఈ మహాభాగవత శ్లోకం. ఈ వేదం అనే కల్ప వృక్షంనుండి మనకు లభించే ఫలం ఏమిటో తెలుసునా? దీనికి సమాధానం తెలుపుతున్నది ఈ మహా భాగవత శ్లోకం. వేదమనే కల్పవృక్షం నుండి జారిపడి, మనకు లభించిన అమూల్యమైన ఫలమే మహాభాగవతం– అని తెలుపుతున్నది, ఈ భాగవత శ్లోకం. "నిగమకల్పతరోః గలితం ఫలం శుక ముఖాత్ అమృత ద్రవసంయుతమ్, పిబత భాగవతం రసమాలయం ముహురహో! రసికా భువి భావుకాః" అని అంటున్నది భాగవత శ్లోకం.

వేదమనే వృక్షం పైన ఏ చిలుక కూర్చున్నది? అది ఏ ఫలాన్ని క్రిందకు జారవిడుస్తున్నది? ఆ ఫలాన్ని అనుభవించేవారు ఎవరు ? అనే ప్రశ్నలను వేసుకొని, దానికి సమాధానంగా పలికిన శ్లోకమే ఈ భాగవత శ్లోకం. శుకులు అనే పేరు గల కలిగిన మహర్షి వేదమనే వృక్షం పైన కూర్చున్న చిలుక. ఇక్కడ పేరు కూడా సమానంగానే ఉన్నది. మహర్షికి కూడా శుకులని పేరు. వృక్షంపైన కూర్చుని ఫలాన్ని జారవిడిచే పక్షికి కూడా శుకమని పేరు. శుకం అంటే చిలుక. ఆ శుకులనే చిలుక వేదమనే వృక్షం నుండి భాగవతం అనే అమృత రసంతో నిండిన ఫలాన్ని గ్రహించి, దానిని కిందకు మనకోసం జారవిడుస్తున్నది. ఆ విధంగా శుకులనే చిలుక జారవిడచిన భాగవతమనే అమృతఫలంలోని రసాన్ని భావుకులైన, అందులోనే రసాన్ని తెలిసినవారైన సహృదయులు అనుభవించగలుగుతున్నారు.

వేదం అనే వృక్షం చాలా పెద్దది, ఉన్నతంగా ఉండేది కదా. అది మనకు అందనంత ఎత్తులో ఉన్నదే!. ఆ వృక్షంలో ఉండే ఫలాలను మనం ఏవిధంగా అనుభవించడానికి వీలవుతుంది? అని మనం సందేహం కానీ, శ్రమను కానీ, బాధను కాని పడవలసిన అవసరం లేదు. ఆ వేద వృక్షంలో ఉండే భాగవతమనే అమృతఫలాన్ని మనం అనుభవించటానికి మనకు ఒక చక్కని ఉపాయం ఉన్నది. మనం ఆ శుక మహర్షిని ప్రార్థిస్తే చాలు. ఆ చిలుక ఆ అమృతఫలాన్ని గ్రహించి, మనకు అందేటట్లు క్రిందకు అందిస్తున్నది. ఏ ఫలాన్ని ఏ చిలుక అందిస్తున్నదని అడుగుతున్నారా? చిలుక పేరునే తనకు పేరుగా పెట్టుకున్న శుక బ్రహ్మం అనే మునివరులు ఆ వేద వృక్షం పైన కూర్చుని ఉన్నారు. “పక్షీ చ శాఖానిలయః ప్రహృష్టః” అని వాల్మీకి మహాముని పలికినట్లుగా శుకులనే చిలుక వేదశాఖలని తనకు నివాసస్థానంగా కలిగి ఉన్నారు, ఈ మహర్షి. మనకు సహాయం చేసే స్వభావం కలిగినవారు. వేద కల్పవృక్షంలో భాగవతం అనే పండు చక్కగా పండి ప్రకాశిస్తున్నది. ఆ భాగవత ఫలంలోని సారం వేదసారమే. అమృత ద్రవం అందులో నిండి ఉన్నది. శుకమహర్షి అమృత రసంతో నిండిన ఆ

ఫలాన్ని వేద వృక్షం నుండి గ్రహించి, మనకోసం అందిస్తున్నారు. రసికులమైన మనం ఆ ఫలంలోని రసాన్ని ఆస్వాదించవచ్చు, అంటే, భాగవతం అనే అమృతఫలంలోని రసాన్ని మనం జీవించినంత కాలం ఆనందంగా అనుభవించవచ్చు. ఆ రసం మధురంగా ఉంటుంది. ఆత్మకు కుష్టిని కలగజేస్తుంది. మంగళకరంగా ఉంటుంది. వేద కల్పవృక్షం నుండి వచ్చిన ఫలం కనుక, అది ఉన్నతంగా ఉంటుందని వేరే చెప్పాలా? “ఓ రసికులారా! రా రండి. ఈ ఫలాన్ని గ్రహించండి. ఇందులో ఉండే అమృత ద్రవాన్ని ఆస్వాదించి, బ్రహ్మానందాన్ని పొందండి” అని అంటూ వేద కల్పవృక్షం పైన వేంచేసి ఉండే శుకం మనలను సాదరంగా ఆహ్వానిస్తున్నది.

ఇంతవరకు, వేదమనే కల్పవృక్షం నుండి లభించే తేనె, బంగారంవంటి అమూల్యమైన ఫలాలను గురించి తెలిసి కొన్నాము. ఇక, వేదాన్ని ఒక కల్పవృక్షంగా ఉపమించినప్పుడు, ఆ ఉపమానం ద్వారా ఇంకా ఏమేమి రస్యమైన అర్థాలను మనం గ్రహించవచ్చునో కొంచెం గమనిద్దాం. దానిని కొందరు కవుల సూక్తుల ద్వారా ఆస్వాదిద్దాం. ప్రస్తుతం, వేదాంతదేశికులు అనుగ్రహించిన యాదవాభ్యుదయ కావ్యంలో ఉండే “ఉదితః ప్రణవాంకురాత్మనా వివిధస్కంధ విభక్తరూఢశాఖః, త్వదనుగ్రహపుష్పితః ప్రజానాం ఫలమిష్టం నిగమద్రుమప్రసూతేః” అనే ఒక అద్భుతమైన శ్లోకాన్ని గమనిద్దాం. వేదం అనే వృక్షానికి మూలం ఏది? శాఖలు ఏవి ? పుష్పం ఏది ? దానివల్ల లభించే ఫలాలు ఏవి? అని ప్రశ్నిస్తే ఆ ప్రశ్నలకు సమాధానాన్ని ఈ శ్లోకం తెలియజేస్తున్నది. వేదం అనే మహా వృక్షానికి అంకురం ఏమంటే, ఒకే అక్షరాన్ని కలిగిన ప్రణవం. వేదంలో తైత్తిరీయం మొదలైన శాఖలే వేదవృక్షంలోని పలు శాఖలు. భగవంతుని అనుగ్రహమే ఆ వృక్షంలోని పూలు. మనం ఏమేమి ప్రయోజనాలను ఆశిస్తున్నామో, అవే ఆ వృక్షంలో ఫలించే ఫలాలు. లోకంలోని జనులందరూ ఈ ఫలాలను పొందుతున్నారు— అనేది పై శ్లోకంలోని తాత్పర్యం.

ఈ శ్లోకం ద్వారా మనకు తెలిసే వేద మహిమలు ఏమేమి? అనే సంగతిని గమనించినప్పుడు,

మొదట, వేదం ప్రణవం అనే చిన్న అంకురం నుండి క్రమక్రమంగా అభివృద్ధి చెంది, పలు శాఖలను కలిగినదై విస్తరించింది. భగవంతుని అనుగ్రహమే ఈ వేదంలో పూచిన పువ్వులు గుత్తులు గుత్తులుగా ప్రకాశిస్తున్నాయి అంటే వేదాన్ని అభ్యసించినవారిని భగవంతుడు చక్కగా అనుగ్రహిస్తున్నాడు– అని భావం. ఇహలోక పరలోక ప్రయోజనాలు అన్నీ మనకు వేదం నుండి లభిస్తున్నాయి. అవే ఈ వేద వృక్షం నుండి లభించే అనేక విధాలైన పండ్లు. వేదాలను అధ్యయనం చేసినవారు కొంతమందే అయినప్పటికీ, ఆ వేదం వల్ల కలిగే ప్రయోజనాలు మాత్రం అందరికీ లభిస్తున్నాయి. ఈ అర్థం పై శోకంలోని "ప్రజానామ్" అనే పదంలోని బహువచనం ద్వారా ప్రకాశిస్తున్నది.

తరువాత, మనం గమనించబోయే ఇంకొక శ్లోకం శ్రీ దేశికులు అనుగ్రహించిన వరదరాజ పంచాశత్ అనే స్తోత్రంలోనిది. "త్రాతాఽపది స్థితిపదం భరణం ప్రరోహః ఛాయా కరీశ! సరసాని ఫలాని చ త్వమ్, శాఖాగతత్రిదశబృందశకుంతకానాం కిం నామ నాసి మహతాం నిగమద్రుమాణామ్" (14) అనే శ్లోకం ఇది.

చెట్టుపైన అనేక పక్షులు గుంపులు, గుంపులుగా చేరి ఉన్నట్లే, వేదమనే వృక్షం పైన దేవతలు గుంపులు గుంపులుగా చేరి ఉన్నారు ఆ వృక్షాన్ని కాపాడే కాపలాదారు భగవంతుడే. ఆ వేదం అనే వృక్షంతో నిత్యమైన, దృఢమైన సంబంధాన్ని కలిగి ఉన్నవాడు, భగవంతుడు. వేదానికి, భగవంతునికి ఉండే సంబంధాలు అనేకం. వేద వృక్షానికి ఆశ్రయం భగవంతుడే. వేద వృక్షానికి పోషకుడు భగవంతుడే. వేద వృక్షానికి నీడ కూడా భగవంతుడే. వేద వృక్షం నుండి లభించే, మధుర రసంతో నిండిన ఫలాలు కూడా భగవంతుడే. వేదం అనే ఈ కల్పవృక్షానికి సమస్తం భగవంతుడే అవుతున్నాడు "ఓ వరదరాజస్వామీ! వేదానికి నువ్వు ఏమి కావడం లేదు?" అనే ప్రశ్న ఈ శ్లోకంలో ఇమిడి

ఉన్నది. ఈ ప్రశ్నలోని తాత్పర్యం ఏమి అంటే, “స్వామీ! నువ్వు అన్ని విధాలుగా వేదానికి సహాయపడుతున్నావు కదా” – అనేదే

ఈ శ్లోకం వల్ల మనకు అర్థమయ్యే విషయం ఏమంటే – చెట్టును ఆశ్రయించుకుని ఉండే పక్షులను ఆ చెట్టు అన్ని విధాలుగా రక్షించేటట్లే, వేదవృక్షాన్ని ఆశ్రయించుకుని ఉండే దేవతలను భగవంతుడు ఆయా ఆపత్సమయాలలో వారిని రక్షిస్తున్నాడు వారికి కావలసిన అన్ని విధాలైన రక్షణలను కలిగిస్తున్నాడు. భగవంతుడు వేదంలో అంకురంవలే వేంచేసి ఉన్నాడు. వేదానికి భగవంతుడు నీడవలె ఉన్నాడు అంటే, వేదాన్ని ఆశ్రయించినవారికి భగవంతుడు ఊరటను కలిగిస్తున్నాడు –అని భావం. వేద వృక్షానికి ఫలం భగవంతుడై ఉన్నాడు– అంటే, వేదం వల్ల పొందబడే పరమ ప్రయోజనం భగవంతుడే– అని తాత్పర్యం.

ఇంతవరకు మనం పెద్దలు అనుగ్రహించిన నాలుగు సూక్తులను ఆధారంగా చేసికొని వేదాన్ని వృక్షంగా చెప్పడంలో ఉండే కొన్ని విధాలైన స్వారస్యాలను మనం అనుభవించాం.

బ్రహ్మ ప్రావాదిష్మ తన్మో మాహాసీత్.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

